# శ్రీ బాబాఖాదర్షా శతకము

గ్రంథకర్త :

శ్రీ వారిభక్తుడు :

భోగరాజు వెంకట్రామయ్య, విజయనగరం.

ది మోడరన్ పబ్లిషర్సు, తెనాలి.

# శ్రీ బాబాఖాదర్షా శతకము

గ్రంథకర్త :
శ్రీ వారిభక్తుడు :
భోగరాజు వెంకట్రామయ్య, విజయనగరం.

ది మోడరన్ పబ్లిషర్సు, తెనాలి.



Rs. 0-6-0

# విజ్ఞప్తి

శ్రీశ్రీశ్రీ ఖాదర్షా బాబావారు ఆ పేరుతో సకలజనోద్ధారణకొరకు నవతరించిన ప్రత్యక్షదైవమని వారి అమానుష మహత్తర చర్యలను చూచుచుండియు, అనుభవించియు నాకు తెలిసిన యంశములలో గొన్నిటిని మాత్రమే సాధారణజనుల కర్థమగునట్లు తేలికభాషలో పద్యములుగా రచించి శతకమనుపేర వెల్లడించితిని గాని, నా భాషాప్రవీణతను ప్రపంచమున వెల్లడిచేయుటకుగాదు. గాన ఇందుల తప్పుల క్షమించ కోరుచున్నాడను.

చిరకాలమునుండి నన్నంకురించి బాధించుచుండిన దీర్ఘవ్యాధులలో నొకటగు పరిణామశూలను, ఆయుర్వేద వైద్యులును ఇంగ్లీషు వైద్యులును నాయందు అభిమానముతో నివారించ చికిత్సల జేసిరి, లాభములేకపోయెను. తుదకు కడుపులో కురుపు ఉండుననియు దానిని ఆపరేషను చేయించుకోవలెననియు నిశ్చయించిరి. సాధారణ సంసారినగుటచే నాకందు కెవ్విధమునను అవకాశములేక దినమంతయు బాధపడుచుంటిని.

శ్రీవారిని దర్శింప నివారణగునని నా కనిష్ఠసోదరుడు భోగరాజు కృష్ణమూర్తి నన్ను ప్రోత్సహించి తీసికొనివెళ్ళి నాజబ్బు వృత్తాంతమును స్పష్టముగా మనవి

చేసెను. వారు ననుచూచి "మీ కేయే వస్తువులుపడవు" అని ప్రశ్నించిరి. పడని వస్తువులుఅన్నియు చెప్పితిని. అందుపైని వారు "మీజబ్బుపోయినది. మీ రారోగ్య వంతులయినారు మీరు ఇప్పుడు నాతో పడవనిచెప్పిన బలోహారవస్తువులను తిను చుండుడు అని ఆజ్ఞయిచ్చిరి. వారిని దర్శించి, వారి వాక్కును వినినవెంటనే ధైర్యము ఆనందము, హెచ్చరిక మున్నగు సదవస్థలు ఒక్కమారుగా పొడమెను. ఆశ్చర్య మయ్యెను. ఆ వాక్కును వినినవెంటనే నొప్పి కానరాలేదు. ఆ వెంటనే ఆజ్ఞనొంది ఆ పూటనుండి పత్యపుభోజనముమాని చిక్కనిపులుసు, పప్పులు, పచ్చళ్ళు మొదలగు బలోహారవస్తువులను తృప్తిగా తిన ప్రారంభించితి. నొప్పి కానరాలేదు హాయికలిగెను. కాఫీహోటేళ్లలో దోసెలు ఇట్టిఫెను కాఫీ ప్రారంభించితిని. ఖాతరుచేయలేదు వారు ఎక్స్ట్రాగాచెప్పిన పనసకాయ పప్పువేసినకూరగూడ వారమునకు అధమం 2 పర్యాయ ములైనను తినుచుంటిని ఖాతరుచేయలేను. నాటినుండియు నేటివరకు అనగా 8 సం॥ లయినది నా కానొప్పి కానరాలేను.

ఇంతియేగాక వారియందు నాటినుండియు దైవభావముపొడమెను తుదకు రాను రాను దైవమనియే నిశ్చయముగలిగినది. అందుచే శ్రీవారి దర్బారునకుపోయి వారిని దర్శించుట వాడుకయ్యెను. అచ్చట వేనవేలు ప్రజలు సర్వకాలములయందు పలు విధములగు గొప్పగొప్ప రోగములు, పిచ్చులు, మూర్ఛలు, మొదలగు మొండి

వ్యాధులుగూడ శ్రీవారి వాక్మాత్రముననే నివారణగుటయు వ్యవహారసంబంధములగు చీకాకులు, గృహకల్లోలు, ఉద్యోగవాంఛలు ఇవి అవి అననేల మానవునికి కావలసిన ఏ కోర్కెయైనను వారి వాక్యామృతమహత్తుచే నివారణయగుట నిత్యమునుచూచు చుంటిని. అందుచే వారియెడల నాకుగలిగిన భక్తిభావముతో వారియాజ్ఞనొంది ఈ శతకమును రచించితిని.

శ్రీవారి అనూనమహత్తులును వచింప వేనవేలుగలవు గాన ఇంతమాత్రమున దృష్టిదీరలేదు చంద్రునికొక నూలుపోగుయన్నట్లు దీనిని రచించి శ్రీవారికి సమర్పించు కొంటిని.

ఈ నా గ్రంథమును మొదటినుండియు వినుచు తగినసలహాల నిచ్చుచు నన్నెచ్చరించుచు నాకు సహాయమొనర్చిన శ్రీవారిభక్తుడు చిరంజీవి పులిపాక సూర్యప్రకాశ రావు (ప్లీడరు B. A. L. L. B. జయపురం) కును, శ్రీవారియందుగల భక్తిచే నిది అచ్చొత్తించిన మ॥ రా॥ శ్రీరామచంద్రుని రామారావుపంతులు గారికిని, శ్రమయనక మొదటినుండియు తుదవరకు నా యీశతకమును విని వారి ఆశీస్సులను దీనిలో ప్రచురింపచేసి నామనవిని చెల్లించిన మ॥ రా॥ రా॥ (కుసుమహర) మల్లాది విశ్వనాధకవి రాజుగారికిని, విజయనగరం మహారాజావారి కాలేజి రిటైరుసీనియరు తెలుగుపండితులగు, మ॥ రా॥ రా॥ అడిదం రామారావుపంతులు గారికిని నా కదముల్కృ తావతంనజ్ఞ.

ప్రత్యక్ష దైవంబగు శ్రీబాబావారి కరుణాకటాక్షములచే మనోసంకల్పసిద్ధులం బొందుచు ఆయురారోగ్యైశ్వర్యముల బొందుదురుగాక. ఓం. తత్సత్.

ఇట్లు,
శ్రీవారి భక్తుడు,
భోగరాజు వెంకటరామయ్య,
గ్రంథకర్త.

విజయనగరం,
3—8—46.



# ఆ శీ స్సు

భోగరాజువారియింట బుట్టినది కవిత్వము. కవిశేఖరులు, విజయనగర సంస్థాన కవీశ్వరులు, నగు స్వర్గీయ శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారిని తెలియని యక్షరాస్యుడు ఆంధ్రులలో నుండడు. ఏతద్గ్రంధకర్త శ్రీ వెంకటరామయ్యగారు, కవిశేఖరుల యగ్రజులు. కవిత్వాభిరుచి వీరికిని పుట్టుకతోడనే పుట్టినది. కాని, కవిత్వ రచనాభారము సోదరులకు విడచిపెట్టి, సంసారభారము తాము వహించుటచే ఇంతదనుక వారి లేఖినినుండి చెప్పుకోదగిన గ్రంధమేదియు రాలేదు.

నేడీ శతకమును రచించి, వారు తెచ్చి చదివినపుడు నాకమందానందము కలిగినది. శ్రీ నారాయణమూర్తిగారే నేనుగా, నేనే వారుగా రెండుదశలు గడిపితిమి. వారు దివంగతులైన వెనుక ఆ కవితా ధోరణికే వాచియుంటిని. నేడు శ్రీ వెంకటరామయ్యగారి రచనలో కవిశేఖరుల ధోరణియు, విద్యోతిత మగుటచే నాకుగల్గిన యానంద మూహింపదగును.

ఈ గ్రంథమునందలి విశిష్టత భగవత్సంబంధిని యగుట యొకటి. శ్రీ ఖాదర్షా బాబావారు నాకును గురుకల్పులు. వారి మహిమ దూరదేశస్థులకుగూడ సువిదితము. అందు మాప్రాంతములవారికి ముఖ్యముగ నాకు మరియు మరియు ననుభూతము. అట్టి

మహిమను లోకమునకు వెల్లడించు మహాభాగ్యము శ్రీ వేంకటరామయ్యగారికి గల్గుటచే వారు ధన్యులు. శ్రీ బాబావారి కరుణాకటాక్షవీక్షణముచే శ్రీ వేంకటరామయ్యగారు ఇట్టి గ్రంథము లనేకములు రచించి. తాను తరించి లోకమును తరింప జేయుదురుగాక!

ఓం తత్సత్

విజయనగరం
1—8—46.

విశ్వనాథ కవిరాజు

శ్రీయుత భోగరాజు వెంకటరామయ్య పంతులువారికి సహజమగు కవితాధార గలదు. ఋషికల్పులగు శ్రీ శ్రీ శ్రీ బాబాగారి దివ్యచారిత్రమును, వారి మహిమాతిశయములను వర్ణించు నీ పద్యశతకమును నేను మొదటినుండి తుదివరకును భక్తిశ్రద్ధలతో కవిగారే చదువగా విని ధన్యుడనైతిని. ఇది భక్తులకు నిత్యపారాయణార్హము.

నా మిత్రులు శ్రీ కవిరాజు విశ్వనాథశర్మగారు ఈ శతకముపై నిచ్చిన అభిప్రాయముతో సర్వవిధముల నేనేకీభవించుచున్నాను. భక్తప్రియులగు శ్రీ బాబాగారి కరుణాకటాక్షములకు పాత్రులై కవిగారు ఇతోధికముగ భాషాసేవ సేయుదురుగాక యని కోరుచున్నాను.

విజయనగరం,
2—8—46,

అడిదము రామారావు,
రిటైర్డు సీనియర్ తెలుగుపండిట్, M. R. కాలేజి.

# ఇష్టదేవతా ప్రార్థన

చం. అనవరతంబు నాదు హృదయాంచిత పీఠము నధ్యసించి, మిం
చిన నవమాధురీ రసము జిమ్ము కవిత్వపు ధార లొల్కున
ట్లనయము బ్రోచుచుండు జగదంబ! సరస్వతి! నాదు వేల్పు! నా
మనమున నెల్లవేళలను మాసతి! వేడెదనమ్మ, భారతీ!

# శ్రీ బాబా ఖాదర్షా శతకము



మ॥ సికతాల్కుందగు మోముతో నిరతమున్ శిష్యాళికిన్ బ్రేమ
పరమార్థంబును బోధజేసి తరియింపంజేయ నీనాటికిన్
హరి బ్రహ్మాదుల ముద్వారంగలుగు నా యాశక్తులం బూని, స
త్కరుణం బ్రోవగ నౌతరించితివిగా ఖాదర్ష బాబా! భువిన్. 1

మ॥ తల మెవ్వారికి కల్గునిదగు మహత్వంబెన్న నే నియ్యడన్
గలనంచుం దలబెట్టినాదనుజుమా, కార్యంబు జేకూర నీ
దలపై భారముమోపి, యీ శతక పద్యాళిన్ రచింపగ నే
గలమున్బట్టితి నీదు భక్తునగుటన్ ఖాదర్ష బాబా! గురూ! 2

మ॥ మదక్రోధ ద్వయ నాశకారివగుటన్ మత్తేభ శార్దూలముల్
ముదమారంగను నూటినింగలిపి నే ముత్తెంబులున్ వజ్రముల్
గదియం గల్పుచు మాలగూర్చియిడితో ఖాదర్ష బాబా! భవ
త్పదభక్తిన్నిది కంఠమందు ధరియింపంగోరి మన్నింపుమా. 3

శా॥ పాలంగూడిన నీటినిన్ వదలి యాపాలన్ గ్రహించున్ సదా
లీలన్ నద్దిర రాజహంస యటులే వెక్కింపకే దోషముల్
మూలంద్రోయుచు మేలు లేగొనుము నింపుంబొందు ప్రేమంబుతో
* కాలీనంబును బొందకుండగను నో ఖాదర్ష బాబాగురూ. 4

శా॥ వేత్తల్ తాతయు నాయనమ్మయును నీ పిత్రుండునీమాతయున్
విత్తేనో యల వృక్షమున్నదియయా వేరాచు దాజుట్టదే
మొత్తం బందున నీవు వేత్తవగుటన్ బూర్వంపు టాచారమే
చిత్తంబందున సంశయంబుగలదే శ్రీ ఖాదర్ రత్నమా.

* నిందింపఁబడనిది.

మ॥ గురువన్నన్నువి చేరునొందు ఘనుఁడై కోటీశ్వరుల్ సైతమున్
నిరతంబున్ దన పాదభక్తిరతులై నీమంబుతో గొల్వ నా
సురలన్ బ్రహ్మయొ, విష్ణుఁడో, శివుఁడో, తాజుద్దీను రూపంబుతో
గరుణం బెట్టెననంగజాలు ఘనుఁడౌ ఖాదర్షబాబా గురూ. 6

మ॥ విధిరత్నంబు వికారి వత్సరపు కార్తీగ్సుద్ధ పక్షంబునన్
బుధవారంబున నాగపూజ చవితిన్ బూజ్యుండ వీవౌటచే
బుధులొందంగల శంఖ చక్రములు నీ పూజ్యంపు పాదంబులన్
దధికాశ్చర్యము గల్గ బుట్టితివి బాబా ? ఖాదరీరత్నమా. 7

శా॥ పూలంగల్గు సువాసనల్ మొదటనే పూమొగ్గలే దెల్పగా
బాలప్రాయమునందె నీదు ఘనమా ప్రజ్ఞాన సంవాస నా
లీలల్ జూచిన దోచుచుండు భువిలో గ్లేశంబులన్ బాపగా
కైలాసాధిపు డౌతరించెననుచున్ ఖాదర్షబాబా గురూ. 8

మ॥ పలుశాస్త్రంబుల నారితేరు ఘనులున్ బౌరాణికోత్తంసులున్
దలపన్ శక్యముఁగాని మేటికవులున్ ధైర్యంపు బల్శూరులున్
గలిగిన్ జ్ఞానులులేని లోటుగొనుకచే గల్గుండు మాపట్నమున్
గల లోపంబును బాప బుట్టితివి యో ఖాదర్షా బాబా! గురూ. 9

మ॥ కవచంబున్ ఘన కుండలద్వయముతో కర్ణుండు దాబుట్టియున్
నవి గోల్పోయి రణంబునోడె దమరో యా శంఖుచక్రంబులన్
దన పాదద్వయమందు శోభిల మునీంద్రస్వామువై పుట్టి, నీ
భవపాశంబును ద్రెంపజాలితివి బాబా ఖాదీరత్నమా. 10

మ॥ ఘను శ్రీరాముని గాంచుటన్ మునుపు యిక్ష్వాక్వంశమేరీతినో
మన శ్రీకృష్ణునిగాంచి యాదవకులం బయ్యారె యేరీతినో
ఘనకీర్తింగనెనో పటానుకుల మగ్రస్థాన మట్లాందెగా
ఘన విజ్ఞాన మునీంద్రు నీవగుచే ఖాదర్షబాబా గురూ. 11

మ॥ చిననాటంగల నీదుచేష్టలు గనన్ శ్రీకృష్ణు బాల్యంబు, మా
కును దోచుంగద నమ్మవేమొ దమపై క్రూరుల్ ప్రయోగింపగా
పెనుశాపై త్వరవచ్చు భూతమును వేవిల్లాచు నీశక్తి వీ
కను దానిం బరిమార్చలేదె! యహాహా! ఖాదర్ష బాబా గురూ. 11

శా॥ నీకుంబాలకుదాది యింట నటనీ నిద్రించు నవ్వేళ హా
హా కాల్పోవెను నగ్నిపుట్టి యెటులో నావీధి వీధంతయున్
నీకై చెందిన యిల్లుమాత్ర మటులే నిద్రించు నీతోడ జీ
కాకుల్ లేకను పోయినుండెనట యో ఖాదర్ష బాబా గురూ. 13

శా॥ నీపై గోపమువచ్చి నీజననియే నిన్గొట్టినన్ దిట్టినన్
శాపంబిచ్చినయట్లు నామెకును నష్టంబొచ్చుటన్ జూడగా
పాపుల్ జేసిన పాపముల్ నుడుపు సద్బ్రహ్మస్వరూపాత్ముపై
పాపారోపణచేయగూడదనియే భావంబు బాబా గురూ. 14

శా॥ స్వారిం జేయుచు పైరుబోవ పగటన్ సర్పంబు బ్యావన్నెలన్
బాలుల్ దీర్చిన యైదుబుర్రలతో బాబా నీకు గాన్పించి తా
నా రాత్రిన్ నిజరూపమున్ గలిగి "గంధర్వుండ మీదర్శనన్
గోరేవచ్చితి" నంచు జెప్పె దివిజుల్ గూడన్ నిన్నుణ మెచ్చిరే॥15

శా॥ దివిజుల్గూడను నిన్ను మెచ్చగల నీదివ్యంపు మాహాత్మ్యమున్
భువి గాంచంగలవారి కే తెలియు నీ పూజ్యంపు శాన్తత్వమున్
నవివేకంబున నైహికంబుకొరకై యాశించు మాబోంట్లకున్
జవిచూడంగను నైన శక్యమగునా సన్మౌని! బాబాగురూ 16

శా॥ నీమోమందున నేమి వింతగలదో నీ తండ్రిగారెప్పుడున్
నీమంబొప్పగ నిన్ను దానుగనియే నిర్ణీత కార్యార్థుడై
దాముంబోవుట నిర్గమించుకొన ఖాదర్షా మహాత్ముండ! యే
నోముల్ నోచెనో తల్లిదండ్రులహా నిన్ను గాంచ బాబా గురూ,

శా॥ నిన్నుంబోల్చగవచ్చు నా ధ్రువునితో విక్రమంబు ప్రహ్లాదుతో
నెన్నన్నీదగు బాల్యమున్ గనగనం జే సంశయంబేల? శ్రీ
మున్నున్ జేసిన పుణ్య మెంతటిదియో మోమున్ గనే స్పష్టమా!
గన్నుల్జూచిన దోచుచుండుగద యోఖాదర్ష బాబా గురూ. 18

మ॥ గురునాజ్ఞన్ శిరసావహించి తమరీ కొండప్రదేశంబులో
దిరమౌ దీక్షనుబూని మేటిదయతో దీనిం బ్రపంచంబులో
వర క్షేత్రంబుగ జేసినారుగద బాబా ఖాదిరీయోగి ఖా
దరుషా బాబ! జనాళి పుణ్యఫల మెంతం జెప్పనున్ శక్యమే. 19

శా॥ శ్రీలక్ష్మీధవు డౌతరించుటను నా సింహాచలం రామతీ
ర్థాలున్ బుణ్యగిరర్సవెల్లియును కూర్మంబున్మరిన్ గాసియున్
నేలీలన్ భువి పేరునొందె నటులే యుచ్చోట విచ్చేసి యె
క్కాలంబందున నుండుఖ్యాతి నిడితో ఖాదర్ష బాబాగురూ. 20

మ॥ సకలైశ్వర్యసమున్నతింగలిగి తత్సౌఖ్యంబు లాసించకే
సకలోత్కృష్టపు ఖాడిరీపదవికై సంకల్పమున్ బూని నీ
సకలంబున్ త్యజియించినాడ వల భీష్మాచార్యునింబోలె హా
యకళంకాత్ముడవైన నీకుసరి బాబా! వేరులేరీ భువిన్ 21

మ॥ మును భద్రుండను భక్తుఁ డొక్కరుడు రాముంగూర్చి ప్రార్థించియా
తని దా మూపున దాల్చుటన్నదియె భద్రాద్రంచు పేరొందె న
ట్లనె నేడిచ్చట నల్లచెర్వుగల మెట్టల్ గూడ నిర్మించుటన్
ఘనక్షేత్రంబగు ఖాదిరీనగరమున్ ఖాదర్ష బాబా గురూ! 22

మ॥ గురునాజ్ఞన్నొక కొండరాతిపయినిన్ గూర్చుండి సద్భక్తితో
గురుమంత్రంబును సంస్మరించుచును నేగోర్కెల్ మదిన్ లేక న
స్థిరప్రాపంచము నిసడించుచును నే జీకాకులన్నొంద, కా
కరణం నెట్టితపంబు సల్పితివోగా ఖాదర్ష బాబా గురూ. 23

మ॥ గురువే బ్రహ్మము విష్ణు డీశుడనుచున్ గుర్వే జగత్తంచు, నీ
గుర్వన్మించిన దెద్ది లేదనుచు నా గూఢైక సారంబుతో
పరిపూర్ణంబు గ్రహించియుండి యిదియే బ్రహ్మంబు బ్రహ్మంబె యీ
ధరతో సర్వమటంచు నీవెరిగితో ధన్యాత్మ! బాబా గురూ. 24

మ॥ సతతంబున్ గురుమంత్రమున్ నియతితో సంపూర్ణ భావంపు స
న్మతితో, సద్హృదయంబుతో నిరతమున్ బ్రహ్మంపుజిజ్ఞాసతో
నతి దీక్ష జపియించి నీగురునకు న్యాయంబు శిష్యుండవౌ
కతము న్నీదగు ప్రజ్ఞ నెన్నవశమా ఖాదర్ష బాబా గురూ 25

మ॥ క్షితిపై గల్గెడి కోర్కెలెవ్వియును నీచిత్తంబునన్ జేర్చకే
మతినీ సద్గురు మంత్రమందునిచి తన్మంత్రంబునే జెప్పుచున్
యతివై సద్గురు గొల్చుచుంట గనినన్ ఆశ్చర్యమాగాదె! యీ
కతము న్నీదగు ప్రజ్ఞ నెన్నవశమా ఖాదర్ష బాబా గురూ! 26

మ॥ మతితో దృష్టిని మేళవించి విమలంబైనట్టి తేజస్సునం
దతి దీక్షంజొరజేసి నిశ్చలతతో నా బ్రహ్మమున్ గాంచుచున్
క్షితిపై ధ్యానములే మైమరచుచున్ జిజ్ఞాపూర్ణుండవా
శతము స్నీదగుప్రజ్ఞ నెన్నవశమా ఖాదర్షబాబా గురూ 27

శా॥ ఎండల్వానల నెంచకుండగ నె నీ వెంతేని దీక్షించి, యీ
కొండల్పెంతను నిర్జనంబగుచు బెన్ ఘోరంబులౌ సర్పముల్
మెండౌ దుష్టమృగంబులుండుస్థలిలో భీతిన్ దపశ్శాలివై
యుండ నీదగు ప్రజ్ఞ నెన్నవశమా యో ఖాదిరీరత్నమా 28

శా॥ ఈరీతిన్ పరమాత్మతో సముడవై యీ పర్వతారణ్యముల్
ఘోరంబయ్యెడి క్రూరజంతుభయముల్ ఖూనీలు చోరీలు యా
చోరీలంగలహత్యలున్ గల స్థలిన్ సుక్షేత్రమున్ జేయు నీ
కౌరా సాటిదె లోకమందు గనగా ఖాదర్షబాబా గురూ. 29

మ॥ పెనుభూతంబుల కాలవాలమగుచున్ భీతొందగాజేయు ని
ర్జన వన్యస్థలి నీదువాసమహిమన్ సుక్షేత్రమై శోభతో
ఘనదర్బారని ఖాదిరీనగర నన్ పూజించునైసేయు క్షేత్రంబయెన్
గనుక న్నీదుమహత్వ మెన్న దరమా ఖాదర్షబాబా గురూ! 30

శా॥ ఈ నీ యాశ్రమ శోభలెన్నవశమా యెంతో మహాచిత్రమా
నానాజాతుల పక్షివృక్షచయముల్ యౌదార్యమా శోభతో
నేనాటన్మరి యెచ్చటన్గననివే యిచ్చోటివై చిత్రముల్
కాన న్నీమహిమంబులెన్నదరమా ఖాదర్షబాబా గురూ 31

శా॥ పదముంచంగను వీలులేక నిచటన్ బల్ డొంకలున్ దుప్పలున్
పొదలున్ బుట్టలు పెద్దవొందలుమరిన్ ముండ్లుండు యిచ్చోటుయీ
పదవిన్నొందుచు కార్లతో జనులతో బల్ క్షేత్రమై రేబవల్
పదివేల్మందిగ వచ్చుచుందురుగదా బాబా మహాశ్చర్యమా. 32

శా॥ రండో రండిటు లార్తులెల్లరును వే రక్షించు బాబా యిటన్
నుండెన్ దీనునుబ్రోవ ఖాదరుష బల్ యుద్రేక రోగంబులన్
నిండా ప్రేమను వాక్సుధారసముచే నిముసంబులోనంచు నీ
జండా బిల్చుచునుండు జెట్టుపయిన్ జక్కంగ సద్గాలిలోన్ 33

మ॥ అమనస్కంబున బూర్ణుడై జనులకు న్నమ్మ్యో మనోవాంఛలన్
దమకు న్వెంటనె నిచ్చి బ్రోచు మిము ఖాదర్షా మహాత్ముండునా
నెమళుల్ బిల్చునసంగ గూయునుగదా నిల్చుండి నీచెట్లపై
దమరా యాశ్రమశోభ లెన్నదరమా ధన్యాత్మ! బాబా గురూ

శా॥ కల్లా జాతిమతంబు లెవియున్ గల్లా విరోధంబులున్
జెల్లా జెల్లవటంచు దెల్పుటకుగా శ్రీవారి క్షేత్రంబులో
బిల్లుల్ గుక్కలు కోళ్లునుంగలియుచున్ బ్రేమంబుభావంబునన్
బిల్లల్లో విహరించుచుం దెలుపుగా భేష్ భేషు బాబా గురూ. 35

శా॥ మా యీ యాశ్రమ స్పర్శచే సకలమున్ మారీతినే చింతలం
బాయంగల్గుచు చిద్విలాసయుతులై బాబా కటాక్షంబుచే
నాయీ సౌఖ్యములంది విత్సలవిడిన్ నౌదార్యతన్నుందు రం
చాయశ్వంబులు, గోవులుం, దెలుపు నిత్యానందముం దిర్గుచున్

మ॥ "మనసారంగల యల్పభక్తినయినన్, మాహాత్మ్యుడైనట్టి యీ
ఘనుడౌ ఖాదరు సామహాత్మ్య గొలువన్. గల్గున్ మహాలాభమం
చని చెప్పంగద మఱ్ఱిచెట్లు విరివై యత్యోన్నతిన్ శోభలన్"
గనులంజూడగ వైభవాన్వితములై ఖాదర్ష బాబా! గురూ! 37

శా॥ నీ యాస్థానవటంబులం జనులు దా నీమంబుతో మూండు మా
ర్లే యేగోర్కె ప్రదక్షిణంబు సలుపున్ సవ్వార్కి చిత్రంబుగా
నాయాగోర్కెల నిచ్చుచుంట గనగా నయ్యారె యేమందు నీ
యీయౌదార్యపు టాశ్రమంపుమహిమల్ యీరీతి బాబా గురూ.

మ॥ తపముం జేసెడివేళ భీతినిడు విస్తారంపు సైర్లోనులో
విపరీతంబగు నీటస్త్రాచొకటి బల్ విస్తారమా భీతి నీ
పదంబొక్కటిబట్ట లక్ష్యమన నెందున్లేక నే దీక్షతో
దపమున్ జేసెడి మేటివౌనివిగ ఖాదర్షా మహాత్మా గురూ 39

శా॥ కళ్ళంగానవియంత వర్షమును పెన్గాలిన్ మహాఘోరమై
రాళ్ళన్లే వడగండ్లవాన పగలున్ రాత్రిన్ సహా పడ్డ నీ
కేళ్ళం గెడ్డలరీతి బార దమకు న్నింతేని లక్ష్యంబులే
కొళ్ళంజల్యావి దీక్షనుంటివిగదా యో ఖాదిరీరత్నమా 40

మ॥ మనసున్ దృష్టిని మేళవించి. యల బ్రహ్మానంద మగ్నుండవై
ఘన యోగంబుననుండు నీదుయెడ, జక్కంబుల్లై బెన్బాము విం
తను నా శంకరు డిట్లువచ్చెనుగ నిద్రాత్రిన్ వినోదార్థమై
యున దోచెంగద నిన్ను జూడగను బాబా ఖాదిరీరత్నమా. 41

శా॥ వంటల్ చేయుచునుండ భక్తులహాహా వర్షంపు పెన్భీతిచే
కంటే ఖాదరుబాబ యాకసమువంకన్, వంటలున్ భోజనాల్
రెంటిన్ శాడును జేయు మేఘముల వర్ణించంగలేమయ్య నీ
కంటన్ జూడుమనంగ గాచితివిగా ఖాదర్షబాబా గురూ! 42

మ॥ అపవిత్రంబుననున్న యూడుదొకనా డాసించి నీసేవకై
విపరీతంబగు తప్పటంచెరుగకన్ వేవచ్చుచుండంగ నీ
తపమాహాత్మ్యమె యొక్క పాముగుచు తత్పాదంబులంజుట్ట భీ
తిపడన్ ఖాదిరిబాబ! నామె నహా బుద్ధిం జెప్పి కాపాడవే 43

మ॥ అహహా నీయుకుప్రక్కలంబులుల రెండా యర్ధరాత్రంబునన్
బహుభక్తిన్ న్నడువంగ భీతిగల యీ బల్కొండ వన్యస్థలిన్
బహుచీకట్లను పైరుబోవునిను బాబా బ్రస్తుతింపంగ లే
రిహమందున్ దెలియంగ శక్యమగునే యీ ప్రభావంబులన్. 44

శా॥ ఘూటేమార్గపు పైడువేళ మృతయౌ కాకంబునుంజూచి నీ
సూటిందప్పని యోగదృష్టియుతవై చోద్యంబుగా నీటినిన్
మేకా నా స్త్రముతోడ దానిపయినిన్ ప్రేమంబుతోబోయ నా
పాటుంబాయుట జీవమొచ్చి వెడగెన్, బాబా పరబ్రహ్మవే. 45

శా॥ కాకే మీరలు దేవయంశభవులున్ గాకున్న యీచిత్రముల్
యేరీ జూపిరి జూపబోవు నరులెందేనిం గనన్నుందురే!
వేరే లేరని చెప్పవచ్చు నథవా లెక్కేమి వారుండినన్
సారంబున్ గ్రహియించవలెగా సర్వజ్ఞ! బాబా గురూ 46

శా॥ మాపుల్ రేపులు మమ్ము బ్రోచుటకు జన్మంబొందినారేమొ నా
యో పుణ్యాత్మక యెట్టిరోగముల మీరొక్కింత లక్షించకన్
రూపుల్మాపుచు దూరదోలుటయు, నారోగ్యంబునందిచ్చుటన్
దోషం జేయనుజుమ్ము శ్రద్ధరుచతో మెల్యాండె? ధన్వంత్రి? నాన్

శా॥ బాగున్ లేకను కామధేనువటులన్ సర్వేప్సితాదాయివై
తా గోలిడు రోగజాల ముడుపన్ ధన్వంత్రివే వీవయై
కాగల్గుండిన గండముల్నుడుపగా కంసారివే వీవయై
యా గౌరీశుని కీర్తిబొందితివి బాబా ఖాదిరీరత్నమా 48

మ॥ తరముల్గావని డాక్టరుల్ వదలగా దారేమియున్ లేక నీ
వర దర్బారుకు వచ్చి నీపదములన్ వైళంబ సేవింప నీ
కరమున్నంటుచు దీవనంబునిడ దుష్కర్మంబుతో రోగముల్
తరువంమంగల పండుటాకులటు వింతన్ రాలు బాబా గురూ.49

మ॥ తరమా నీదగుప్రజ్ఞ నెన్నగను నంతంబున్నదా చెప్పుమా
వర నీవాజ్ఞ్మహాతిన్ స్వరూపమహాతిన్ హస్తంపుమాహాత్మ్యమున్
త్వరలో గోర్కెల వాసుదేవుడటులక్ తత్క్షణంబిచ్చుటన్
బరమాత్మ్యుండవు నీవగావె చెపుమా బాబా మునీంద్రోత్తమా

శా॥ ఎంతో గొప్ప మహానుభావుడవు నీ విట్లై మనోవాంఛలన్
వింతన్ దీర్చెడి సాటిలేని మునివై యిచ్చోట వేంచేసి, మ
మ్మింతో బ్రోచు మహానుభావుడవు ని న్నింతన్ గనన్ లేరు తా
కాంతంబందిన పిచ్చివానిగతి నో ఖాదర్షి బాబా! గురూ 51

శా॥ వింతన్ స్నీదగు శిష్యు లచ్చటచటన్ విజ్ఞానమానీంద్రులై
యెంతో గౌరవ మొందుచుండకుజునుల్ యీర్షల్ మదిన్నుంచుటన్
కొంతేనిన్ను గాంచ నేరరుగ నాకుం గొప్ప యాశ్చర్యమా
కాంతంబందిన బిచ్చివానిగతి నో ఖాదర్షి బాబా గురూ 52

మ॥ ఇరవై నాలుగు వత్సరంబులయి నన్నింతేని బాధించు యా
పరిణామంబను శూల నొక్క త్రుటిలో బల్ వింత బోజేసితో
మరియున్ బత్యము గిత్యమున్ గనక మున్మార్గున్ టిఫెన్లున్ సహా
కరవుస్నీర దినంగ జేయుముని నో ఖాదర్షి బాబా గురూ 53

మ॥ పడవంచున్ దిన మాని వేసినవియే పథ్యంబులై నిత్యమున్
కడు పెక్కన్ భుజియించినన్నరియె శంకన్ లేక జీర్ణించుటన్
కడు నాశ్చర్యమహత్యమున్ గలుగు సాక్షాద్బ్రహ్మరూపుండవై
నుడువుల్ బ్రహ్మవరంబులై జనులకున్ *నొవ్వుల్ సదాదీర్చుగా 54

శా॥ ఖాతాఖానిని జేయుచుండునపుడున్ భక్తాళిపై బ్రేమచే
నా తత్వంబులనుండు సారమును మీ రందందు నిర్ణించి, మా
తెల్వింతో పరీక్ష చేయుటకునై మమ్మున్ దరింపన్ సదా
మాతో కాలముబుచ్చు నిన్ను గనగా మా శక్యమా సద్గురూ



* వేదనలు

# రెండవ భాగం

## ప్రార్థన

మ॥ ఘనదర్బారున జ్ఞానదృష్టిమతితో గానా, బజానాదులన్
వినుచుండిన్ వినకుండ, నీ వటులనే విజ్ఞాన మానంబుతో
గనుచుండిన్ గనకుండ దృష్టివిడకన్ గాడంపు దీక్షందునన్
ననయంబుండెడి నీకు మ్రొక్కెదను బాబా ఖాదిరీ రత్నమా. 56

మ॥ తరియింపంగను నాశచే పుడమిలో దైవంబ పీవంచు నెం
దరో నిత్యబును గోర్కెలొందగను మీ దర్బారు క్షేత్రంబులో
కరముల్ మోడ్చుచు మ్రొక్కుచుందురుగదా, గాపాడవా? వారినిన్
కరుణన్ననట్లు బ్రోవ కష్టమగునా ఖాదర్ బాబా గురూ 57

శా॥ లేరే యెందరొ యోగులీ ధరణిలో లేరే మహాత్మానులున్
లేరే గొప్ప మహాత్ములున్, గలిగినన్ లెక్కింగొనన్ వచ్చునే
దూరప్రాంతనివాసులై జనులకున్ గోడింతయు నైతిరే
కారే నీవలె కష్టము ల్మడుపగా ఖాదర్ష బాబా గురూ. 58

మ॥ తమలాభంబును గోరువార లహహా తండోపతండంబులై
మముబోంట్లన్ గనకుండి వారె తరియింపజూచు వారేలకో
తమతోబాటుగ లోకులన్నహితముం దాటింపజేయంగ నీ
యమలంబౌ తపమెల్ల ధారనిడు బాబా! నన్ను రక్షింపుమా.59

శా॥ నిన్నున్నమ్మిన నన్ను నేల నిటులన్ నీకింత జాగేల? నీ
కన్నం దైవము లేడు లేడనెడి నిక్కంబైన భక్తుండ, నీ
వన్న న్భక్తులబ్రోచు దేవుడవు గావా? వేగ నన్నింక నా
పన్నున్ బ్రోచుట నీకు దప్పదుజుమూ బాబా మునీంద్రోత్తమా.

శా॥ ప్రత్యక్షంబగు దైవ మీవగుటచే భక్తాళి నిం జేరి వా
రత్యంతంబగు భక్తిచే మొరలిడన్ సయ్యో మనోవాంఛలన్
నిత్యంబున్ దయతోడ దీర్చెదవుగా నీకేల నాపైని నీ
వ్యత్యాసంబును జూపగా నిటుల బాబా ఖాదిరీరత్నమా. 61

శా॥ శ్రీరంజిల్లెడి మోముతో జిరవుగా జీరాడు మేల్ శాలితో
కారుణ్యామృతవాక్కుతో విమలమా కల్యాణపుందృష్టితో
పారావారముబోలు మేటిదయతో ప్రజ్ఞాన భావంబుతో
రారా ఖాదరుషా మహాత్మ నను వే రక్షింపు బాబా గురూ. 62

మ॥ స్థిరమింతం గనలేని యీ యిహములో శ్రీసంపదల్ గోరకన్
పరసౌఖ్యంబును గోరుచుంటి నదియే ప్రాప్తంబుగా జేసి నీ
వరకీర్తిం జగమందు నిల్పుకొనుమో స్వామీ! భవద్భక్తుడన్
పరమాత్మాంశభవుండ నీవుగద యో బాబా! ననున్ బ్రోవవా?

మ॥ కరముల్ ద్రోద్చుచు వేనవేల్పుజిలుఁ నెక్కాలంబు నీచెంత, ఖా
దరు బాబా! యని బిల్వగానె నపుడే తద్బాధలన్ బాయుచున్
పరమానందము నొందుచుండ నహాహా బాబా! ననున్ బ్రోవ నీ
కరుణాం జూపగ జాలమేల? నిటులన్ ఖాదర్షబాబా! గురూ! 64

శా॥ ఏయే గోర్కెలనైన గోరనపుడే యెంతేని చిత్రంబుగా
నాయా గోర్కెల వాక్సుధారసముచే నందిచ్చు నట్లిచ్చుచున్
నీ యౌదార్య దయాప్రభావములతో నింపార బ్రోచేటి నీ
యా యౌదార్యము జూపు నాపయిని బాబా! ఖాదిరీరత్నమా.

శా॥ ఏ నేరంబును జేసినాను మరియు న్నేపాపమున్ జేసితో
ధ్యానంబందున నేమిలోటుగలదో దర్శించ జాగించితో
నా నేరంబుల ద్రోసిపుచ్చి యిక పూర్ణంబైన ప్రేమంబు నా
పై నుంచంగను వేడుచుంటినిజుమా బాబా! మునీంద్రోత్తమా. 66

శా॥ సారంబింతయులేనిదాని నిటు సంసారంబుగా నమ్ముచున్
ఘోరంబౌ పెను మోహశృంఖలముల జిక్కుల్ బొందగన్ లేక వే
మారుల్ బిల్చిన బల్కవేమి? తగునా మహాత్మ? నీభక్తుడన్
చేరందీయుచు బ్రోవు మింకనయినన్, శ్రీ ఖాదిరీరత్నమా! 67

మ॥ పరదేశాగమ భక్తకోటులకు నీప్రజ్ఞాప్రభావంబులన్
త్వరలో గానగజేసి గోర్కెలిడుచున్ స్వస్థానమందుండు మ
మ్ము రవంతైనను జూడవేమి! చరణమ్ముల్పట్టి ప్రార్థించినన్
వర దైవంబవు నీవు మాకుగద యో బాబా ననున్ బ్రోవవా?68

శా॥ కల్లల్ జేతువె? నన్ను బ్రోవకిటు విజ్ఞానంపుటాధిక్యతన్
జెల్లన్నేరదో నాదుపట్ల? మరి నీశిష్యున్ బరీక్షింతువో
యుల్లంబందలి యూహయే మొయిటులన్మ్రోరించుటల్ న్యాయమే?
చెల్లిదనౌనటు చెప్పివేయుమికనో దివ్యప్రభా పూరితా. 69

మ॥ "ధనమే మూల మిదం జగ" త్తనెడి సూత్రంబునం గూడుకన్
దన దారాసుతులాది బంధువులు వే దూరంబుగా జూతురా
ధన మింతన్ సిరిపోవువెన్కను మునీంద్రా! ఖాదిరీరత్నమా!
గనుకన్ నిన్నె మనంబునన్ గొలుతు నో ఖాదర్ష బాబా గురూ!

శా॥ ఏరూపంబును నెట్టిరోగియయినన్ వీక్షించగా నంతనే
యా రోగంపు బలంబుతగ్గి మనమం దానంద ధైర్యంబు ల
వ్వారిం బొందునొ యట్టి రూపయుతడో స్వామీ! సదానంద వే
మారుల్ మ్రొక్కెద ఖాదిరీతిలకమా! మౌనీంద్ర! బాబాగురూ

శా॥ కల్లల్ జెప్పగ లేదు భక్తతతికిన్ గష్టంబులందీర్చ నీ
యుల్లంబందున నీమమొంది జనులన్ యుత్సాహ సంపూర్ణతన్
చల్లంగా దయజేసి బ్రోతువుగదా సత్యంపు టాచార్యివై
కళ్ళంజూడవు నామపట్ల తగునా? ఖాదర్ష బాబా గురూ! 72

శా॥ కోపంబన్నది నీకులేదు సరియే కోపాలి కోపంబులన్
మాపంజేయుచు శాంతవంతులట్టులన్ మార్చేటి నీప్రేమయున్
పాపంబుల్ దునుమాడి బ్రోచుఘనమా ప్రజ్ఞాన మాహాత్యమున్
నాపైదాచియుంచఘనమా?న్యాయంబ? బాబా!జూపక గురూ. 73

శా॥ ఆహా! నీదగు హస్తదాయక ఫలంబైనన్ విభూదైన నో
మహాత్మా! తుదకున్ దృణంబె యయినన్ మారోగముల్బాపి, మా
హాహాకారము లెల్లబాపి, సుఖముల్ యందిచ్చు బాబా గురూ!
నీహస్తప్రభ గానుపింపుమిక నే నీభక్తునో సద్గురూ? 74

శా॥ నీనామంబును నెవ్వరేని సరియే నీమంబుతో దల్చగా
వే, నాశంబగు నెట్టి బాధలయినన్ వేయేల నీనామమే
శ్రీ నా రాముని గామమట్లు ప్రతిభల్ ధాత్రిన్ సదాబొందగా
నేనేపాపము జేసితయ్య చెపుమా నీపట్ల బాబా! గురూ! 75

శా॥ ఈయారన్ దమ భక్తకోటి కెట్టుల న్నిష్టార్థముల్ గూర్తువో
ఏ యే వేళ ప్రసంగముల్ జరిపెదో యేరీతి మమ్మేలెదో
యా యా దేశపు భక్తులన్ సహితమున్ నారీతి నా వేళలం
దా యా రీతుల బ్రోచు నీకు బరువయ్యా బాబ! రక్షింపుమా

శా॥ అంతంబన్నది లేనిజన్మ మరణాలంతంబు నొందించగా
స్వాంతం బందలి దీక్షగల్గి సతమున్ సద్భక్తులా వారికిన్
సుంతైనన్ శ్రమ లేని బోధనిడుచున్ సుజ్ఞాన సౌభాగ్యముల్
వింతన్నిచ్చుచు నన్ను బ్రోచుటకు నీవేగాక వేరెవ్వరా 77

శా॥ ఏయాధిక్యత నీకు లేనియెడలన్ నీరీతి వేన్వేలుగా
నాయాసంబని లెక్కగొన్క నరుదెంచన్నేల? దూరస్థులున్
నీయందుంగల దైవశక్తి గనియే నిన్నెంతో సేవింత్రు యా
నీ యాధిక్యతజూపి బ్రోవుమిక నే నీ భక్తుడన్ గానొకో 78

శా॥ సత్యంబున్ వచియింతు దైవము భువిన్ సాహస్రరూపంబులన్
నిత్యంబున్ మనమందు గోర్కెలొసగున్ నీమంబుతో బెంచుచున్
ప్రత్యక్షంబును గాడటందు తమకో ప్రత్యక్షమై ప్రోతురే
నిత్యంబున్నను నమ్ము భక్తులను ధ్యానింతు న్నన న్ప్రోవుమా

శా॥ జ్ఞానాత్మున్నను జేసెదంచు మదిలో నాశించి నిం జేరి, నే
ధ్యానం బెప్పుడు జేయుచుండుటను బుత్రప్రేమ నీవుంచి త్రా
దానం జేసియు బుత్రునీకు నయితిన్ ధైర్యంబు నద్బొందె. న
జ్ఞానం బింకను దీసి ప్రోవుమిక జ్ఞానాతీత సాబాగురూ, ౪౦

శా॥ నా యజ్ఞానము బారద్రోలి ఘన సుజ్ఞానంబు నిప్పించి, దో
మాయల్బొందగనీక దుర్భ్రమలలో మగ్నంబు గాకుండ నన్
జేయంజాలెడివాడవంచును, నినున్నే * నేతగా నెంచితిన్
యోయయ్యా ప్రియభృత్యుగా గొనుము నన్నో బాబ నిక్కొల్చెదన్

* ప్రభువు

మ॥ నరజాలంబుల నెల్లవేళలను నానాకాంక్షలం దీర్చుచున్
పరమేశుం బలె బ్రోచుచుందువుగదా బాబా యనున్నట్లనే
వర నీవాక్సుధనిచ్చి బ్రోవకునికిన్ వహ్వారె యేమందు, ఖా
దరుషా ఖాదిరిబాబ! స్వామి! విమలాత్మా! నన్నుపేక్షింతువా.

మ॥ తిరమౌ మానవకోటికెల్లరకు త్వత్పాదద్వయంబున్నదా
పరమాత్ముండని నమ్ము నీవు నిజమౌ భక్తాళికిం దక్క. నె
ల్లరకున్ జూడగ శక్యమే చెపుమ యోమాహాత్మ! మౌనీంద్ర! ఖా
దరుషా ఖాదిరిబాబ! నీదగు పవిత్రంబైన మాహాత్మ్యముల్. 83

మ॥ నిరతంబున్నను నేలుచుండుమిక నా నేరంబులన్ బాపుచున్
దిరమౌ సౌఖ్యమునిచ్చుచున్ విమలమౌ దృష్టిన్ సదాగొల్తు నీ
వరపాదంబులు దప్ప నమ్మనిక రవ్వంతైన వేరెవ్వరిన్
కరముల్ మోడ్చుచు నీకె మ్రొక్కెదజుమా ఖాదర్షబాబా గురూ.

మ॥ భరియింపంగనులేను యీ యిహములో బ్రాపించుకష్టంబులన్
స్థిరతా యుండదు బుద్ధిశూన్యమగు బల్ చీకాకులా మెండు య
స్థిరమా సంపదలెల్లబోవు వెనుకన్ ఛీ ఛీ యిహంబొల్ల ఖా
దరుషా ఖాదిరిబాబ! నీ పదములన్ దర్శింతు నెల్లప్పుడున్ 85

మ॥ సరి నీకీభువి లేరటం చెరిగితిన్ సత్యంబుగా నమ్ముమా
మరి వే రెవ్వరి నమ్మజాలనుజుమా మర్మంబు లేకుండ నీ
వరపాదంబుల నమ్మియుంటినిక నీ స్మర్శించ నాశక్యమే
కరముల్ మోడ్చుచు మ్రొక్కెదన్ గనుమా ఖాదర్ష బాబా గురూ.

శా॥ ఏ ఏ జబ్బైన నను బొందనీక నను, నీ వెల్వేళ రక్షింపుమా
జే జే యంశభవా! ననున్ గరుణతో క్షేమంబుగా బ్రోవుమా
రోజున్ రోజును నిన్ను గొల్తునుజుమా, బ్రోవంగ నీ వేజుమా,
నా జేతున్ దగ మోడ్చి మ్రొక్కెదజుమా సన్నేలుమా! సద్గురూ.

శా॥ ఆరోగ్యంబును వృద్ధిజేయుడో కటిన్ నాపైని నెల్లప్పుడున్
మీరా మీరనకుండు నట్టి బ్రతుకున్ మీసేవపై బుద్ధియున్
శ్రీరాజిల్లెడు నీదు దర్శనము సుశ్రీపాద సత్సేవయున్
కారుణ్యంబున నిచ్చి బ్రోవుమెపుడున్ ఖాదర్షబాబా గురూ ౪౪

శా॥ కుక్షిన్ సర్వప్రపంచము న్నెరుగుచున్, గూర్చుండియిచ్చోటనే
నక్షీణంబగు ప్రేమ భక్తతతులన్ నౌనట్లు నందందునన్
సాక్షాత్కారమునిచ్చి బ్రోతువుగదా స్వద్భక్తబృందంబులన్
నాక్షేమంబును జూడవేమి? తగునా? న్యాయంబె బాబా గురూ

మ॥ తమభక్తుల్ తమ ప్రేమనొంది నిజతత్వజ్ఞాన సంపూర్ణులై
విమలంబౌ మునిరాజులై, పుడమిలో విఖ్యాతులై యుండరే?
తమచే నిర్ణయమొందుతావులను ఖాదర్షామహాత్మా! యహో
తమరా ప్రేమను జూపరేమిటికో? యింతంగాని బాబా గురూ.

శా॥ ఒల్లన్ మేడలు మిద్దెలుం ధనము నేనొల్లన్ నిహంబెప్పుడున్
నొల్ల న్నీదిగు సేవతప్ప నెవియున్ నొల్లన్ మహాసంపదల్
కల్లా శాశ్వతమింతలేని సుఖముల్ జ్ఞానంబె ద్రై చేసి సం
పల్లాలిత్యముజూపి బ్రోవుమిక నో బాబా ననున్ బ్రోవుమా.91

శా॥ సత్యంబన్నది లేక గష్టయుతమౌ సంసారపు జైలులో
నిత్యంబున్ గల మోహశృంఖములచే నేజిక్కియున్నాడ నా
నిత్యాత్మజ్ఞత్వపు నేర శిక్షకీటులన్ నేనోర్వలేకుంట, నే
నిత్యంబున్ దమ నామమే దలతు ముక్తింజూపు బాబా గురూ.

మ॥ వివిధంబౌ ఘన వేదశాస్త్రములలో విజ్ఞానమున్ సారమున్
స్వవివేకంబున స్వీకరించి, విమలజ్ఞానంపు సజ్జ్యోతివై
భువి విజ్ఞానపు జీకటుల్ నుడుప నుద్యోమిం మునీంద్రుండవై
యువశాఠంబునుహాంసు యీశుడపు గావా! ఖాదిరీరత్నమా. 93

శా॥ ఏరా నీదయ నాదుపట్లనిడకన్ నిట్లున్నుపేక్షింతువా?
పారావారమువంటి కష్టతతులన్ బ్రాల్మాలుటన్ జిక్కి కా
ర్జార న్నున్నితి దిక్కులేదు దరిజేర్చన్నీదు దివ్యంపు స
త్కారుణ్యంబను నావనిమ్ము త్వరగా ఖాదర్షబాబా! గురూ! 94

శా॥ పాపంజెన్నడు బుద్ధిపూర్వకముగా బ్రాల్మాలి నే జేయ నే
పాపాత్ముల్ని జేరనే సతతమున్ బాబామహామంత్రమే
నాపాలం గల దైవమంచు స్మరియింపన్నేల రక్షింపవో
కోపంబన్నది నీకుగూడ గలదో గోప్యంబు వే జెప్పుమా 95

శా॥ నా తాపంబును దీర్చువార లెవరో నన్నీ వుపేక్షించినన్
జూతామంచు పరీక్ష చేయుదువో; హా చోద్యంబులంజూడ, నీ
వే తప్ప న్నితరంబు లేదనుచు నీవే దైవమం చేను నీ
జేతం జిక్కితి బాబ! నన్మరువకన్ శీఘ్రంబ నబ్రోవుమా. 96

శా॥ కప్పూ విప్పు, సమర్థతన్ గలిగి, మా కర్మంపు కారాకులన్
నిప్పంటించువిధాన నీమహిమనే నిర్మూలముం జేసి, మా
యప్పా? ఖాదరుబాబ? నాభయములన్ నన్నింటి వే దీర్పుమా
యెప్పట్లన్ గన నీవ దిక్కు మరి లే రెవ్వారు బాబా గురూ 97

శా॥ కల్యాణంబును నిచ్చిబ్రోచు ఘనులన్ జ్ఞానాత్ములా యోగులన్
దుల్యుం డెవ్వడు నీకు లేడనుచు నెందున్ ఢంక వాయించి, సా
కల్యంబౌనటు సాటిచెప్పెదను యో ఖాదర్షా! నా బుద్ధి చాం
చల్యంబన్నది బాపి. నీ పదనుతిన్ జక్కంగ జేకూర్చుమా

శా॥ వేదాంతాఖ్యులు, శాస్త్రవేత్తలు, మరిన్ విజ్ఞాన పారీణులు
న్నా దైవజ్ఞులు బద్ధనాధిపతులున్, యయ్యా? నినుఁ గాంచ నీ
పాదాబ్జంబుల మ్రొక్కి భక్తులగుటన్ బాబా? నినున్ బోల్చగా
వేదంబుల్సహితంబు జేతగనవే వేయేల బాబా గురూ! 99

శా॥ నిన్నున్నే గ్రహియించునంతవరకున్ నీప్రేమ సాయంబుచే
నిన్నున్ స్తోత్రము జేయ భక్తతతికిన్ నేర్పొందు వాక్యంబులన్
మిన్నంటంగల భక్తి వ్రాసితిని భూమిం దీని నెల్లప్పుడున్
జెన్నొందం, పరంబు నిమ్ము దయతో శ్రీఖాదరీరత్నమా. 100

మ॥ తలక్రిందన్ ధనముంచుకొంచు నహహా దారిద్రమున్ బొందుచున్
బలు చీకాకులు బొందువానిగతి, నీప్రజ్ఞాప్రభావంబులన్
దెలియన్నేరక వారు వీరనుచు నే దీనత్వమున్ బొందితిన్
గలుషంబుల్ దెగటార్చి బ్రోవుమిక నో ఖాదర్షబాబాగురూ. 101

మ॥ పదియవతారము లెత్తియున్ బ్రజల దా పాలించ లోటుంటచే
మదిలో యోచన జేసి చేసి తుదకున్ మా భర్త మమ్మెల్లరన్
నెదలో గన్గెడి ప్రేమ బ్రోవ ధరలో నిచ్చోట ఖాదర్ష నన్
పదకొండో యవతార మెత్తెవనుటల్ బాబా? నిజంబౌజువా? 102

మ॥ పరమాశ్చర్యము నొందజేయు దమదా ప్రజ్ఞానిమాహాత్మ్యమే
కరవాలంబుగ జేతబట్టి భువిలో గాంతాళి నా యోగలన్
వర నీశక్తిన్ గన సాముచేయుచును వహ్వారె ఖండించు, యో
పరమాత్మాంశభవుండ? ఖాదరుష బాబా నన్ను రక్షింపవా?103

మ॥ పురిషడ్వర్గపు మూలమైన యహమన్ వ్యాఘ్రంబుపై స్వారియై
స్థిరచిత్తంబను గొల్సుచే బిగిచి, శ్రీ బ్రహ్మతేజస్సు నా
కరవాలంబునుబట్టి, నీవుజన, దుష్కర్మంపు శెన్బోతులున్
మరుమాటాడక ప్రాణముల్ విడువవే! మాహాత్మ బాబాగురూ

శా॥ ప్రత్యక్షంబగు దైవమీవ యనుచుఁ భక్తాళి నెవ్వేళలన్
సత్యాసత్యవివేకజ్ఞానమిడుచున్ సన్మార్గులన్ జేయుచున్
అత్యౌదార్యపు బ్రహ్మమార్గరతుల ట్లాయ్యారె వే మార్చుచున్
నిత్యానందము నొందజేతువుగదా? నీభక్తు సన్నోవవా! 105

శా॥ కష్టంబుల్ గడతేర్చు దైవమని నే కాంక్షించి నిష్ఠారతిన్
స్పష్టంబౌనటు జెప్పెదన్ వినుము నీ సద్దేవతాశక్తులన్
సృష్టించే ప్రతిసృష్టి జేతువహా, బల్ చిత్రంబు మాబోంట్లకున్
గష్టంబుల్ గడతేర్ప భారమగునా? ఖాదర్ష బాబా గురూ. 106

శా॥ జాలంబింతయు జేయకయ్య సతమున్ సద్భక్తితో గొల్చెదన్
కాలంబింతయు వ్యర్థపుచ్చకయె నే ఖాదర్ష బాబాగురున్
బోలంజాలెడివారు లేరనుచు నిభ్భూమిం దగన్ జాటెదన్
పాలించగను జాగుసేయకుము యో బాబా నమస్కారముల్



## మంగళము

జనుల నెల్లర మంగళం బిడుచు నిష్టంబూని వాక్యారి నె
మ్మనమునందుంగల వాంఛల న్నిడెదు సన్మౌనీంద్ర! మాహాత్మ! వే
డ్కను నీభక్తుఁడు భోగరాజు లజ వెంకట్రామయాఖ్యుండిదే
గొనుమా మంగళహారతిన్ దయను నీకుం భక్తిపూర్వంబుగా

శ్రీ శ్రీ శ్రీ

సమాప్తము.



# తప్పొప్పుల పట్టిక

| ప॥ | పం॥ | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 1 | నిశ్చ్యుడన్ | నిర్స్యుడన్ |
| | 2 | నాదను | నాడను |
| | 3 | రచింపగ | గచింపంగ |
| | 4 | నీగుభక్తు | నాశ్రితుండ |
| 3 | 3 | యిడిశో | యిడితిన్ |
| 4 | 2 | వెక్కింపకే | రెక్కింపకే |
| 5 | 2 | జుట్టదే | బుట్టదే |
| 6 | 4 | బెట్టెనవంగ | బుట్టెననంగ |
| 7 | 1 | విధిరత్నంబు | తిధిరత్నంబు |
| 9 | 2 | శక్యమురాని | శక్యముకాని |
| | 4 | ఖాదర్షా | ఖాదర్ష |
| 10 | 3 | దన | దశ |
| | 3 | స్వాముచై | స్వామిచై |
| 11 | 4 | వీతగుచే | వీవగుటచే |
| 12 | 1 | చేపలు | చేష్టలు |
| | 3 | బిత్లాచు | బిల్లాచు |
| 13 | 1 | బాలడు | బాలిడు |
| 14 | 3 | నుగుపు | నుడుపు |
| 16 | 4 | శఖ్యమగునా | శక్యమగునా |
| 17 | 4 | నిన్నుగాంచ | నిన్నుంగాంచ |
| | | నోచనా | నోచినో |
| 21 | 2 | ఖాడిరీ | ఖాదిరీ |
| | 4 | వేరుశేరీ | శేరుషేర |
| 23 | 3 | నొందకా | నొందకే |
| | 4 | నెట్టితపంబు | ఘోరతపంబు |
| | | సల్పితివొగా | సల్పితివిగా |
| 24 | 2 | గూడైక | గూఢైక |
| 25 | 3 | గురునకు న్యాయాంబు | గురునకు న్యాయ్యాంబు |
| | 4 | కతము | కతన |

| ప॥ | ఫా॥ | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 26 | 4 | కతము | కతన |
| 27 | 3 | ధ్యానము లే మైమరచుచుక్ | ధ్యానము లేక మైమరచుచున్ |
| | | జిజ్ఞాపూర్ణుండు | జిజ్ఞాసపూర్ణుండు |
| | 4 | కతమున్నిదగు | కతనన్నిదగు |
| 30 | 1 | భీతొందగాజేయు | భీతిప్రదంబైన |
| | 3 | పూజించుగైసేయు | గైసేయు |
| 31 | 2 | యౌదార్యహా | హాసాంపుబల్ |
| 32 | 2 | వొందలు | వొండలు |
| 33 | 3 | నిండా | నిండో |
| | 3 | నిముసంబు | నిమ్సంబు |
| | 4 | జెట్టుపయిన్ | జెట్టుపయినిన్ |
| 35 | 1 | మతంబు లెవియున్ | మతంబులాది గొవియున్ |
| | 3 | ప్రేమంబు | ప్రేమంపు |
| 37 | 3 | యత్యోన్నతిన్ | యత్యున్నతిన్ |
| 39 | 3 | పదంబొక్కటి | పదమునొక్కటి |
| 41 | 2 | నీకుయెడ | నీకుమెడ |
| | 2 | జక్కంబుట్టై | జక్కంజుట్టై |
| 44 | 4 | యీప్రభావంబులన్ | ఈ నీ ప్రభావంబులన్ |
| 45 | 1 | ఘూటే | ఘూటీ |
| 46 | 1 | దేవయాంశ | దేవతాంశ |
| | 3 | వేరేవేరని | తేరేతేరని |
| | 4 | గ్రహియించవలెగా | గ్రహియించి మించవలెగా |
| | 4 | సర్వజ్ఞు | సర్వజ్ఞ |
| 48 | 1 | జానున్ లేఃను | జానున్ లేకను |
| | 2 | గర్గోలు | గగ్గోలు |

2

| ప॥ | ఫా॥ | తప్పు | — | ఒప్పు |
|---|---|---|---|---|
| | | | | ఇన్ |

4

| ప॥ | ఫా॥ | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 96 | 4 | నగ్రోబ్రుమా | రక్షించుమా |
| 97 | 2 | నీమహిమనే | నీమహిమచే |
| 100 | 4 | జెన్నొందన్ వరంబునిమ్ము | జెన్నొందX వరంబులిమ్ము |
| 102 | 4 | మెత్తైవనుటల్ | మెత్తైవనుటల్ |
| 108 | 1 | ప్రజ్ఞానీమహాత్మ్యమే | ప్రజ్ఞానమాహాత్మ్యమే |
| | 3 | వహ్వాదె | వహ్వారె |
| 104 | 1 | వురిషడ్వర్గపు | అరిషడ్వర్గపు |



